అనగనగా.... ఒక ఊరిలో ఒక పిల్లవాడు ఉన్నాడంట.

అతని పేరు రాముడు.

రాముడు మంచి బాలుడు అంటారు కదా!

ఆ మాదిరిగానే.... మన రాముడు కూడా

పేరుకు తగినట్లుగా మంచి బాలుడు.

ఆ ఊరిలో రాముడంటే అందరికీ ఇష్టం.

ఎందుకంటే, రాముడు ఎప్పుడూ కూడా...

చాలా బుద్ధిగా నడుచుకునేవాడు.

చక్కగా చదువుకునేవాడు,

Free time లో ఎంచక్కా ఆడుకునేవాడు.

రాముడికి వాళ్ళ అమ్మ, నాన్నలు ఎంత చెపితే అంత.

అంటే... వాళ్ళ అమ్మ కానీ, వాళ్ళ నాన్నగారు కానీ...

ఫలానిది వద్దు అంటే,

ఇక అసలు దాని జోలికి పోయే వాడే కాదు.

పెద్దల మాటను శ్రద్ధగా విని, పాటించేవాడు.

అలా రోజులు గడుస్తూ వున్నాయి.

రోజూ మాదిరిగానే రాముడు....

తను చదువుకునే గురుకులానికి వెళ్ళేవాడు.

గురుకులం అంటే రాముడు చదువుకునే school

అన్నమాట.

మనం మన school teachers ని madam, sir అని

అంటుంటాం కదా!

రాముడు చదువుకునే గురుకులంలో వాళ్ళ teacher ని

గురువుగారు అని సంబోధిస్తారన్నమాట.

ఆ గురుకులం చాలా చక్కగా వుండేది.

పూల మొక్కలు, పక్షుల కిలకిలా రావాలు.

పర్ణ కుటీరాలు, పెద్ద పెద్ద చెట్లు.... చాలా అందంగా

వుండేది.

సరే! ఆ రోజు Class Time అయ్యేప్పటికి,

రాముడు ఇంకా వాళ్ళ class mates అంతా కలసి...

Class room లోకి వెళ్ళారు.

పిల్లలంతా ఇవాళ గురువుగారు ఏం చెబుతారా? అని

ఆసక్తిగా ఎదురు చూస్తున్నారు.

వాళ్ళ గురువుగారు ఆ రోజు ఆ పిల్లలకి పాఠం చెప్పడం,

ఈ విధంగా start చేశారు.

నాయనలారా!!

మీరు అంతా ఎంతో అదృష్టవంతులు. ఈ గురుకులం

చాలా గొప్పది.

ఈ గురుకులంలో విద్యను అభ్యసించిన వారు (అంటే

ఇక్కడ చదువుకున్నవారు)

తర్వాతర్వాత ఎంతో గొప్పవారు అయ్యారు.

మీరు కూడా అలా గొప్పవారు కావాలంటే, నేను చెప్పే

పాఠం శ్రద్ధగా వినాలి మీరంతా!

అని చెప్పగానే....

పిల్లలంతా ముక్త కంఠంతో... అలాగే గురువు గారు!! అని సమాధానం చెప్పారు.

సరే! అయితే...

చిన్నారి బాల లారా!!
ఇవాళ నేను మీకు చెప్పబోయే పాఠం
మీరు జీవితాంతం గుర్తుపెట్టుకోవాలి సుమా!
కలలో కూడా మీరు ఈ పాఠాన్ని మరచిపోకూడదు.
ఇవాల్టి పాఠం పేరు "భగవత్ తత్త్వం"
చాలా చాలా important.

భగవంతుడు సర్వాంతర్యామి.
అంటే భగవంతుడు లేని చోటు లేదు.
భగవంతుడు దయామయుడు.
భగవంతుడిని నమ్మిన వాడు ఎన్నటికీ నష్టపోడు.

భగవంతుడు ప్రభువులకు ప్రభువు.
భగవంతుడే సృష్టి కర్త.
భగవంతుడి కంటే వేరైనది, గొప్పది మరొకటి లేదు.
భగవంతుడే అందరికీ ఆధారం.
భగవంతుని పట్ల విశ్వాసం వున్నవాడికి
భయము ఉండదు.
ధర్మబద్ధంగా జీవించే వాళ్ళను
భగవంతుడు ఎప్పుడూ రక్షిస్తాడు.
ఇంటా బయట,
గాలిలో నీటిలో,
ఆకాశంలో, పాతాళంలో,
పైనా కిందా...
పర్వతాలలో, సముద్రాలలో...
మనకు కనిపించే చోట, కనిపించని చోట...
అంతటా భగవంతుడే నిండి వున్నాడు.

అంచేత మనం ఎప్పుడూ భగవంతుడిని
మరచిపోకూడదు.
భగవంతుడిని ఎల్లప్పుడూ ధ్యానిస్తూ వుండాలి.

నాయన లారా!!
ఇవాల్టి పాఠం విన్నారు కదా!
మీకు పాఠం బాగా అర్థమైందా అని అడుగుతారు
గురువుగారు.
పిల్లలంతా ముక్త కంఠంతో
ఓహ్! బాగా అర్థం అయ్యింది గురువుగారు అని
సమాధానం చెబుతారు.

సంతోషం నాయనలారా!
ఇంద... ఈ అరటి పండ్లను ప్రసాదంగా తీసుకోండి.
అయితే, ఈ అరటి పండుని మీరు ఎవరూ చూడకుండా
తినాలి సుమా!
రేపు మీరంతా మళ్ళీ ఇక్కడకు వచ్చాక...
ఎవరెవరు ఎలా తిన్నారో చెప్పండి.
అని అరటి పండ్లు ప్రసాదంగా ఇచ్చి,
పిల్లలందరినీ వారి వారి ఇళ్ళకు పంపారు గురువుగారు.

అందరూ అలానే గురువుగారు అంటూ...
చకచకా వారి వారి ఇళ్ళకు బయలు దేరారు.

ఇంటికి వెళ్ళాక.... రాముడు ఏం చేశాడు....?
తరువాత కథ ఏం జరిగిందనేది
మనం రేపటి 'అంతర్యామి'లో తెలుసుకుందాము.

సాయిరాం!!